జాతీయోద్యమ పోరాలకు దూరంగా, కడుదూరంగా...

# వెంకయ్య, చంద్రబాబుల చారిత్రక అజ్ఞానం

ఎ.బి.కె. ప్రసాద్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

జాతీయోద్యమ పాఠాలకు దూరంగా, కడుదూరంగా...
**వెంకయ్య, చంద్రబాబుల చారిత్రక అజ్ఞానం** - ఎ.బి.కె. ప్రసాద్

---

రాజకీయ / సామాజిక / ఆర్థిక గ్రంథాలు

ప్రచురణ నెం. : 8

ప్రథమ ముద్రణ : ఆగస్టు, 2002

వెల : రు. **5/-**

ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, బ్యాంకుస్ట్రీట్,
హైదరాబాదు - 500 001
విశాలాంధ్ర బుక్‌హౌస్ .
(అబిడ్స్ /సుల్తాన్‌బజార్) హైదరాబాదు,
విశాఖపట్నం, కాకినాడ,
విజయవాడ, గుంటూరు, తిరుపతి,
అనంతపురం, హనుమకొండ.

ముద్రణ : విశాలాంధ్ర ప్రెస్, విజయవాడ

# జాతీయోద్యమ పాఠాలకు దూరంగా, కడుదూరంగా...

# వెంకయ్య, చంద్రబాబుల చారిత్రక అజ్ఞానం

"అబద్ధాల నోటికి అరవీశెడు సున్నం"కూడా చాలదట! అలాగే మూసిపెట్టిన కొద్దీ పాచిపోయిందంటారు ఈ రెండు తెలుగు సామెతలూ- రాష్ట్రపతి పదవికి 'బిజెపి పరివార్' తరపునా, గుజరాత్ మైనారిటీలపై ఊచ కోతలకు ఊరడింపుగా అభ్యర్థిగా ఎంపిక చేసిన డాక్టర్ అబ్దుల్ కలామ్‌కు, ప్రత్యర్థిగా భారత స్వాతంత్ర్య సమరయోధురాలు, సుభాష్‌చంద్రబోస్ ఇండియన్ నేషనల్ ఆర్మీలో ఝాన్సీరాణీ రెజిమెంట్‌కు కెప్టెన్‌గా ఉన్న కెప్టెన్ లక్ష్మీసెహ గల్‌ను ఉమ్మడిగా నిలబెట్టిన వామపక్షాలను ఆడిపోసుకుంటూ కారాలు మిరియాలు నూరుతున్న కేంద్రమంత్రి వెంకయ్యనాయుడుకూ, ఏఎండకా గొడుగు పట్టడంలో సిద్ధహస్తుడై ముగ్గురు ఉద్దండుల వ్యక్తిత్వాలతో చెలగాట మాడడానికి వెరవని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుకూ అక్షరసత్యంగా వర్తిస్తాయి! వీరిలో ఒకరు, జాతీయోద్యమఘట్టాలకు, అందులో భాగంగా వివిధ రాజకీయ పక్షాలు అనుసరించిన వ్యూహాలలో, ఎత్తుగడలలో అంతర్వాహినిగా సాగిన వివిధపాయలకూ ముఖ్యంగా కమ్యూనిస్టు విప్లవకారులు నిర్వహించిన చారిత్రక కర్తవ్యాలకు, బాధ్యతలకు, నేతాజీ సుభాష్‌చంద్రబోస్ పట్ల కమ్యూనిస్టుల వైఖరికీ వక్రభాష్యాలు చెప్పిన మంత్రి కాగా, వేరొకరు (బాబు) స్వాతంత్ర్య సమరయోధులలో అగ్రగణ్యుల పాత్ర తెలియకుండా, కెప్టెన్ లక్ష్మీసెహగల్ ఎవరో తెలియకుండా 'ఎబ్బే! నాకామె పేరే తెలియద'ని చరిత్రపట్ల అజ్ఞానాన్ని ప్రకటించుకుని అభాసుపాలయిన "దేశం" నాయకుడూ, రాష్ట్రానికి ముఖ్యమంత్రీ! తన గ్రాడ్యుయేషన్, పోస్ట్‌గ్రాడ్యు యేషన్ పునాదులకు "నారుపోసి నీరుపెట్టిన" సామాజిక శాస్త్రాలనే యిప్పుడు కాలదన్ని, మానవ విజ్ఞానాభివృద్ధికీ, మానవ సమాజనిర్మాణానికీ, దాని వికాసానికీ దోహదపడే సామాజిక శాస్త్రాలను (సోషల్ సైన్సెస్) అధ్యయనం చేయవలసిన అవసరం లేదని చెప్పి, 1998-99 విద్యా సంవత్సరంలోనే కళాశాలల్లో ప్రకృతిశాస్త్రాలను, సామాజిక శాస్త్రాలనూ బోధనాంశాల నుంచి తొలగించిన వ్యక్తి చంద్రబాబు! సామాజిక శాస్త్రాలలో అంతర్భాగమైన చరిత్రను తొలగించిన నాయకునికి చరిత్రాధ్యయనంతో పనిలేదు. తన చరిత్రను రాయించుకోడంలో తప్ప సమాజ చరిత్రలో, దాన్ని దిద్దితీర్చడంలో ప్రముఖుల పాత్రగురించి తెలుసుకోవలసిన అవసరం లేదని ఆయన తీర్మానం! కార్యదర్శులున్నంతకాలం కాగల కార్యాన్ని గంధర్వులు తీరుస్తారనుకున్నా చరిత్రకు వక్రభాష్యాలు చెప్పడంలో, అజ్ఞానాన్ని ప్రదర్శించడంలో వారూ తక్కువ తినలేదు! విద్యార్థి యువజనుల్లో కంప్యూటర్ విద్యపట్ల, సమాచార సాంకేతిక వ్యవస్థపట్ల

మోతాదుకు మించిన భ్రమలుకొల్పి స్వల్పకాలంలో ధనార్జన చేసి కోటికి పడగలెత్తవచ్చునన్న అవగాహనకు చంద్రబాబు అంకురార్పణ చేశారు. స్వాతంత్ర్య సమరయోధులెవరో తనకు తెలియకుండాపోవడంతోపాటు భావితరాలను కూడా అదే అజ్ఞానంలోకి నెట్టుతున్నారు. ప్రకృతిశాస్త్రాల్లో, చరిత్ర మున్నగు సామాజిక శాస్త్రాల్లో చేరే విద్యార్థుల సంఖ్యకు గ్రహణం పట్టించారు. ఈ చారిత్రక తప్పిదం వల్ల దేశ చరిత్ర, సమాజాల చరిత్ర, దేశదేశాల స్వాతంత్ర్య ఉద్యమాల చరిత్ర అధ్యయనం పట్ల యువతలో ఏహ్యభావాన్ని వ్యాప్తిచేశారు. వరల్డ్‌బ్యాంక్ మేనేజింగ్ డైరెక్టర్ ఎవరో, ఐ.ఎం.ఎఫ్. డైరెక్టర్ ఎవరో చెప్పగల (రుణదాతల పేర్లు విధిగా జ్ఞాపకం ఉంటాయి) బాబుకు, సుభాస్‌చంద్రబోస్, ఇండియన్ నేషనల్ ఆర్మీకి చెందిన దాదాపు ప్రతీఫ్రేమ్‌లోనూ కనిపించే యోధ కెప్టెన్ లక్ష్మిసెహగల్ ఎవరో తెలియక పోవడంలో ఆశ్చర్యంలేదు కనీసం "పద్మ విభూషణ్" బిరుదాంకితురాలు అసలు తెలియక పోవడం లోనూ అబ్బురం లేదు. ఈ "చారిత్రక తప్పిదం" సవరణలతో ముగిసేదికాదు, రాజకీయ చైతన్యంతో మాత్రమే; బురాక్రాట్ల, టెక్నోక్రాట్లు కబంధహస్తాలనుంచి విడివడగల్గినప్పుడు మాత్రమే; స్వంత అధ్యయనానికి నడుంబిగించినప్పుడు మాత్రమే ఈ అజ్ఞానానికి ఆటవిడుపు ఉంటుంది.

## చరిత్రకు దూరమైన వెంకయ్య 'ప్రేలుళ్లు'!!

రాష్ట్రపతి పదవికి బిజెపి-పరివార్ (ఎన్.డి.ఎ) మురా డాక్టర్ కలామ్‌ను వడపోతలో ఆఖరి అభ్యర్థిగా "కడగొట్టు" క్యాండిడేట్‌గా నిలబెట్టింది కాబట్టి- ఇక ప్రతిపక్షాలు అంగీకరించి తీరాలన్న నిరంకుశ ధోరణిలో బిజెపి నాయకులు వాదనలు మొదలెట్టారు. రాష్ట్రపతి పదవికి అభ్యర్థుల ఎంపిక కావటం ప్రారంభమైనది లగాయతూ- యింతవరకూ 11 సార్లు జరిగిన ఎన్నికల్లో అసలెన్నడూ రాష్ట్రపతి పదవికి ఎన్నిక జరగనట్లే చిత్రించడంలో బిజెపి పరివార్ అబద్ధాలకు దిగజారింది. రాష్ట్రపతి ఎన్నిక ఏకాభిప్రాయంతో జరగాలనుకున్నప్పుడు, అందుకు తగినట్టుగా ప్రతిపక్షాలతో సంయుక్తంగా చర్చించి ఒక అభిప్రాయానికి రావడంలో తప్పులేదు. కాని ఆపని తానొక అభ్యర్థిని నిర్ణయించేసుకొని, దాన్ని మీరూ ఆమోదించాలని చర్చలద్వారా కాకుండా 'ఫోన్'లో చెప్పేసి కూర్చోడం ప్రజాస్వామ్య రాజకీయ సంప్రదాయం కాదు. ప్రెసిడెంట్ నారాయణన్‌తో డైరెక్టుగా "మీకు రెండవదఫా అభ్యర్థిత్వం యివ్వరాదని నిర్ణయించాం" అని ప్రధానమంత్రి పదవిలో వున్న వ్యక్తి 'బ్లంట్'గా చెప్పిరావడం భారత రిపబ్లిక్ చరిత్రలో మొట్టమొదటిసారిగా జరిపిన వికృత రాజకీయం! ఈ రాజకీయంలో ఒక్క నారాయణన్ మాత్రమేకాదు, వైస్‌ప్రెసిడెంట్ కృష్ణకాంత్, గవర్నర్ పి.సి.అలెగ్జాండర్‌లను కూడా పరివార్ ప్రభుత్వం బలిపశువుల్ని చేసింది! ఈ వరసలో నాల్గవ వ్యక్తి, ప్రసిద్ధ క్షిపణి శాస్త్రవేత్త డాక్టర్

కలామ్! ఒక్క నీలం సంజీవరెడ్డి తప్ప (1977లో) రాష్ట్రపతి పదవికి ఇంతవరకూ జరిగిన ఎన్నికల్లో ఏకగ్రీవంగా ఎన్నికైన అభ్యర్థి అంటూ లేరని గుర్తించాలి. రాజేంద్రప్రసాద్‌కు మొదటిసారి కె.టి.షా, రెండవసారి ఎన్.ఎస్.దాస్‌లు పోటీ అభ్యర్థులు కాగా, సర్వేపల్లి రాధాకృష్ణన్‌కు సి.హెచ్.రాయ్, జాకీర్ హుస్సేన్‌కు కోకా సుబ్బారావు, వి వి.గిరికి సంజీవరెడ్డి, ఫక్రుద్దీన్‌అలీ అహ్మద్‌కు త్రిదిబ్‌చౌదరి, జైల్‌సింగ్‌కు జస్టిస్ హెచ్.ఆర్.ఖన్నా, వెంకట్రామన్‌కు జస్టిస్ వి.ఆర్.కృష్ణయ్యర్, శంకర్‌దయాళ్‌శర్మకు జి జి.స్వెల్, కె.ఆర్.నారాయణన్‌కు టి.ఎన్.శేషన్ (శివసేన అభ్యర్థిగా)- రాష్ట్రపతి పదవికి పోటీపడినవారే. వీళ్ళెవరికీ లేని అభ్యంతరం నేడు వామపక్షాల తరపున పోటీచేస్తున్న "పద్మవిభూషణ్" కెప్టెన్ లక్ష్మికి వ్యతిరేకంగా, వామపక్షాలకు వ్యతిరేకంగా ఎందుకు పుట్టుకు రావాలి? "దేశభక్తి" అంతా తన గుత్తసొమ్మైనట్టుగా కేంద్రమంత్రి వెంకయ్యనాయుడు రాష్ట్రపతి పదవికి అభ్యర్థిని ఎంపిక చేయడంలో వామపక్షాలు "జాతీయ స్రవంతికి, జాతి అభిప్రాయానికి భిన్నంగా" నడుస్తున్నాయని ఆరోపించారు. అంతేగాదు, క్షిపణిశాస్త్రవేత్త అయిన కలామ్‌ను నేటి సరిహద్దు ఉద్రిక్తతల సందర్భంగా రాష్ట్రపతి పదవికి అభ్యర్థిగా ఎంపిక చేయడం సభ్య దేశాలకు తప్పుడు "సిగ్నల్"ను అందించడమేనన్న కెప్టెన్ లక్ష్మి ప్రకటననూ ఆయన తప్పుపట్టడానికి ప్రయత్నించారు. దేశీయ ప్రభుత్వం అణ్వాయుధాలకు గాక అన్నవస్త్రాలకు ప్రాధాన్యం యివ్వాలని అన్నవాళ్ళు "దేశభక్తులు" కారన్నట్టు అణ్వాయుధ ధారణే "దేశభక్తి" అయినట్టూ వెంకయ్యనాయుడు మాట్లాడుతున్నారు. అణ్వాయుధ ధారణకు, హద్దులు మీరిన ఆయుధీకరణకూ ఒక్క వామ పక్షాలేకాదు, "పోఖ్రాన్-II" అణుపరీక్షలను నిరసిస్తూ పెక్కు మంది భారత మేధావులు, రాజకీయ పక్షాలూ, శాంతి కాములూ ప్రకటనలు చేసిన విషయాన్నీ, పాకిస్తాన్ ప్రయోగాల పట్ల వ్యతిరేకతను వ్యక్తం చేసిన వాస్తవాన్నీ "పరివార్" వెంకయ్య మరవరాదు, అంతేగాదు, ఇలాంటి ప్రయోగాలకు విరుద్ధంగా ఐక్యరాజ్య సమితిలో భారత ప్రతినిధి వర్గం నాయకుడుగా వాజ్‌పేయి కూడా ప్రసంగాలు చేసి వచ్చిన సంగతినీ మరవరాదు! ఇంకా స్పష్టంగా చెప్పాలంటే జాతిపిత మహాత్మాగాంధీ భారత ఉపఖండం విభజన తరవాత, కాశ్మీర్ సమస్య పూర్వరంగంగా ఇండియా-పాకిస్తాన్‌లు పరస్పరం సేనలను మోహరించు కుంటున్న సందర్భంగా చేసిన హెచ్చరికను వెంకయ్య ఎలా వ్యాఖ్యానిస్తారో చూడాలి

## గాంధీజీ భవిష్యత్తులో ఏంజరగనుందో యిలా హెచ్చరించారు

"ఈ సైనిక మోహరింపుల ఫలితం యుద్ధంగా మారుతుంది. ఇంతకూ అసలు సమస్య మన వనరులను మన పిల్లల విద్య కోసం ఖర్చు పెట్టుకోవడమా లేక తుపాకులమీదా మందుగుండు సామాగ్రి మీదా వెచ్చించుకుంటూ పోవడమా?

అట్టే చూస్తే నాకు భవిష్యత్తు శూన్యంగా కనిపిస్తోంది"! బహుశా మన వెంకయ్య ఉద్దేశంలో గాంధీజీ కూడా "జాతి భావన నుంచి", "జాతీయ స్రవంతి" నుంచీ వేరు పడినవాడనీ, "దేశభక్తి" లేని వాడనీ మనం భావించాలా?

పరివార్‌కూ, వెంకయ్యకూ "దేశభక్తి" అంటే దేవాలయపూజలకో, మందిర తగాదాకో మాత్రమే పరిమితమయినది కావచ్చు. ఎందుకంటే "పరివార్"కూ, భారత స్వాతంత్ర్య సమరానికి ఎలాంటి సంబంధం లేదు, పొత్తు అంతకన్నా లేదు. వారి 'పొత్తూ పొంతనల్లా' హిట్లర్ "ఆర్యజాతి" సిద్ధాంతంతోనూ భారతదేశంలో స్థిరపడిన భిన్న జాతుల మైనారిటీలను దేశంనుంచి వెళ్ళగొట్టాలన్న విచిత్రనినాదం- 'హిందూత్వ'తో మాత్రమే! అందువల్లనే వెంకయ్య, చరిత్ర తెలుసుకోకుండా 1942 క్విట్ ఇండియా ఉద్యమంలో కమ్యూనిస్టులు జాతీయ స్రవంతి నుంచి వేరుపడ్డారనీ, 1962లో చైనా దాడి సందర్భంగా మరొకసారి జనాభిప్రాయానికి దూరమైపోయారనీ, ఇప్పుడు రాష్ట్రపతి అభ్యర్థి ఎంపికలో కూడా వారు "జాతిభావన" నుంచి వేరు పడిపోయారనీ అవాకులు, చవాకులూ ప్రేలారు వెంకయ్య ప్రకటనలు చరిత్రకు వక్రభాష్యాలు. ఆయన 'పరివార్' చరిత్ర పుటలు తిరగేస్తే మొత్తం జాతీయ వ్యతిరేక భావాల పుట్ట అనీ, బ్రిటీష్ సామ్రాజ్యవాదుల అండతో 'హిందూరాష్ట్ర' నిర్మాణానికి నిస్సిగ్గుగా ప్రయత్నించిన ముఠా అనీ రుజువవుతుంది. అన్నింటికన్నా మించి ఆ 'హిందూరాష్ట్ర' నిర్మాణం పేరిట, ముస్లిం మైనారిటీల ప్రయోజనాలను, హిందూ-ముస్లిం ఐక్యతను కాపాడ్డానికి తపన పడిన గాంధీజీని హత్య చేసిన దుర్మార్గుడు నాథురామ్ గాడ్సే పచ్చి పరివార్ అగ్రగామి సంస్థ అయిన ఆర్.ఎస్.ఎస్ సభ్యుడన్న సంగతిని వెంకయ్య మరచిపోయారా? ఎన్ని సవరణలు చేసుకుంటే ఈ "చారిత్రిక తప్పిదం" క్షాళనమై పోతుంది? అసలు "క్విట్ ఇండియా ఉద్యమం"లో వెంకయ్యగారి పరివార్ పాత్ర ఉందా? ఉంటే ఆ చరిత్రకు దాఖలాలేవీ?! ఈ విషయంలో "పరివార్" పరమ చరిత్ర హీనులని మరవరాదు! "క్విట్ ఇండియా" ఉద్యమం రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో వచ్చింది. ఆనాడు ప్రపంచ ఫాసిజానికీ, బ్రిటిష్ సామ్రాజ్యవాదానికీ కూడా వ్యతిరేకంగా దేశంలో కాంగ్రెస్, వామ పక్షాలు ఉద్యమించాయి. వ్యూహంలో, ఎత్తుగడలలో తేడపాడాలు తప్ప -లక్ష్యం ఉభయులకూ ఒక్కటే, ప్రపంచ సామ్రాజ్య వాదాన్ని ప్రతిఘటించడం. భారత స్వాతంత్ర్యానికి గ్యారంటీ యిస్తే ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రారంభమైన ప్రపంచ ఐక్య సంఘటనలో భాగస్వామి అయిన బ్రిటన్‌తో కలిసి వస్తాం అని కాంగ్రెస్ భావిస్తే, ముంచుకొస్తున్న ప్రపంచ ఫాసిజాన్ని ఓడించడం ద్వారా భారత స్వాతంత్ర్య సముపార్జనకు మార్గం మరింత సుగమమవుతుందని కమ్యూనిస్టులు పేర్కొన్నారు. వ్యూహ రచనలో భిన్న పోకడలలో భాగంగా నాడు కాంగ్రెస్ - కమ్యూనిస్టుల మధ్య చర్చలూ జరిగాయి ఈ చర్చల సందర్భంలోనే గాంధీజీ కమ్యూనిస్టుల వ్యూహాన్ని "కరేజ్ ఆఫ్

కన్విక్షన్"గా అభినందించారు. స్వాతంత్ర్య సంగ్రామంలో విభిన్న పక్షాలు తమ తమ వ్యూహాలతో ముందుకు సాగడంలో తప్పులేదని ప్రకటించారు. అంతేగాని కమ్యూనిస్టులు స్వాతంత్ర్య సంగ్రామం నుంచి వేరు పడలేదని గ్రహించాలి ప్రధాన స్రవంతిలో కమ్యూనిస్టులు భాగస్వాములు కాబట్టే ఆనాటి కుట్ర కేసులన్నింటినీ భరించి త్యాగాలు చేసిన వాళ్లల్లో కమ్యూనిస్టులది మెట్టు వాటా అయింది! ఈ విషయంపై తలెత్తిన వివాదాల సందర్భంగా గాంధీజీకి - నాటి కమ్యూనిస్టు పార్టీనేత పి సి జోషీకి మధ్య నడచిన ఉత్తర ప్రత్యుత్తరాలు చూస్తే వెంకయ్య శంకలు నివృత్తి అవుతాయి. ఎందుకంటే- ఈ విషయంలో కమ్యూనిస్టుల దేశభక్తిని శంకించవలసిన అవసరం లేదని గాంధీజీ సహితం ప్రకటించారని మరవరాదు! కమ్యూనిస్టులేకాదు, జాతీయ నాయకులైన గాంధి, నెహ్రూ, విశ్వకవి ఠాగోర్ కూడా ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంలో సోషలిస్టు సోవియెట్ విజయం పొందాలని ఆకాంక్షించారు. టాగోర్ అయితే సోవియెట్ గెలవాలి, గెలవాలనీ, ప్రపంచ మానవాళికి సోవియెట్ విజయం శ్రీరామరక్ష అనీ శ్లాఘించారు.

## "క్విట్ ఇండియా"కు మోకాలడ్డిన శ్యామ్‌ప్రసాద్!

"హిందూ మహాసభ" స్థాపనకూ, "హిందూత్వ" నినాదానికి, "దేశాన్ని హైందవీకరించాలనీ, సైనికీకరించాల"న్న నినాదానికి ఆద్యుడు సావర్కర్ కాగా, "జనసంఘ్"ను స్థాపించిన వ్యక్తి శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ. 1942 ఆగస్టు తీర్మానంగా ప్రసిద్ధికెక్కిన కాంగ్రెస్ "క్విట్ ఇండియా" తీర్మానాన్ని వ్యతిరేకించినవారు శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ! అఖిల భారత కాంగ్రెస్ ఈ తీర్మానం చేయడానికి సరిగ్గా 15 రోజుల ముందుగా శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ ఆనాటి బెంగాల్ గవర్నర్‌కు ఒక లేఖ రాస్తూ (1942 జూలై 26) రానున్న ఆందోళనలను, ఉద్యమాలను అణచివేయాలని సలహా ఇచ్చారు! ముఖర్జీ లేఖలో ఇలా వుంది: "ఈ యుద్ధ (రెండవ ప్రపంచ యుద్ధం) సమయంలో ప్రజల మనోభావాలను రెచ్చగొట్టి, తద్వారా అల్లర్లను సృష్టించడానికి పన్నే పథకాలను, అభద్రతా భావాన్ని సృష్టించే పథకాలనూ ప్రభుత్వం ఎదుర్కోవాలి"! శ్యామ్ ప్రసాద్ ముఖర్జీ ఈ పని ఎప్పుడు చేశాడు? కాంగ్రెస్ నాయకులు జైళ్ళలో ఉన్న సమయంలో, క్విట్ ఇండియా పిలుపు సందర్భంగా ఈ సలహా ఇచ్చారు! తద్వారా బ్రిటిష్ వాళ్ళతో అధికారం పంచుకునే ప్రయత్నాలు చేశారు! ఆనాటి గవర్నర్ ఆశీస్సులతో ఈ ముఖర్జీ బెంగాల్‌లోని ఫజుల్ హక్ ప్రభుత్వంలో పదవులను ఆశించారు. ఫలితంగా హక్ ప్రభుత్వంలో కొన్నాళ్ళ పాటు ముఖర్జీ ఆర్థిక మంత్రి పదవిని కూడా వెలగబెట్టారు! ఇలా ఆదినుంచీ ముఖర్జీ పదవుల కోసం "క్విట్ ఇండియా ఉద్యమాన్ని ప్రతిఘటించడమే" లక్ష్యంగా పెట్టుకున్నారు! ఆనాటి ఉద్యమంలో గాంధీజీ ప్రభృతులంతా అరెస్టు కాగా

"హిందువుల" పేరిట విడుదల చేసిన విజ్ఞప్తిలో "క్విట్ ఇండియా ఉద్యమాన్ని బలపర్చవద్దని" సావర్కర్ (హిందూ మహాసభ ద్వారా) పిలుపిచ్చాడు! ఏ రోజునా సావర్కర్ "భారత జాతీయత"ను (ఇండియన్ నేషనలిజం) బోధించిన పాపాన పోలేదనీ, కేవలం "హిందూత్వ" అని, "హిందూమతం" అనీ మాత్రమే సావర్కార్ పేర్కొంటూ వచ్చారని పట్టాభి సీతారామయ్య "కాంగ్రెస్ చరిత్ర"లో వివరించారు! ఇంతకన్నా చిత్రాతిచిత్రమైన పరిణామం- ఒకవైపున సింధ్ అసెంబ్లీ పాకిస్తాన్ ఏర్పాటును సమర్థిస్తూ తీర్మానం చేసినప్పటికీ "హిందూ మహాసభ" ముస్లిం లీగ్‌తో చేతులు కలిపి అధికారంలో గల సింధ్ సంకీర్ణ ప్రభుత్వంలో పాల్గొంది! పాకిస్తాన్ ఏర్పాటు తీర్మానం వచ్చిన తర్వాత కూడా తీర్మానం పట్ల నామమాత్రపు "నిరసన" తెలిపిందే గానీ హిందూ మహాసభ మంత్రులు ప్రభుత్వ పదవులకు రాజీనామాలు మాత్రం ఇవ్వలేదని వెంకయ్య గుర్తుంచుకోవాలి! అంతకన్నా అవమానకర సంఘటన- అండమాన్స్ సెల్యులార్ జైలు నుంచి తాను విడుదల కావడం కోసం సావర్కర్ బ్రిటిష్ సామ్రాజ్య వాదులు పెట్టిన అవమానకర షరతులన్నింటినీ కనీసపు నిరసన కూడా తెల్పకుండా అంగీకరించడం! తీరా ఆ షరతుల్ని బొంబాయిలో కొత్తగా ఏర్పడిన కాంగ్రెస్ ప్రభుత్వం (1937 మేలో) తొలగించే దాకా గతిలేకపోయింది! "విచారణ" అంతా "సబబు"గానే జరిగిందనీ, విధించిన శిక్ష "న్యాయం"గానే ఉందనీ ప్రకటించాలని బ్రిటిష్ ప్రభుత్వం విధించిన షరతును సావర్కర్ ఒప్పుకున్నారు! అయితే "ఇంత మాత్రాన తన విడుదలకు దీనినొక షరతుగా భావించరాద"ంటే దాన్నీ సావర్కర్ ఒప్పేసుకున్నారు. సావర్కర్ బ్రిటిష్‌వాడికి రాసిచ్చిన లేఖలోని పాఠం ఇలా ఉంది: **"నా విచారణ ధర్మంగానే జరిగింది, శిక్ష న్యాయంగానే ఉంది. ఇంతకుముందు కడచిన దినాల్లో అనుసరించిన దౌర్జన్య పద్ధతులను నేను మనఃపూర్వకంగా ఖండిస్తున్నాను. చట్టానికీ, రాజ్యాంగానికీ నా శక్తికొద్దీ కట్టుబడి ఉంటానని, అది నా విధి అనీ భావిస్తున్నాను. సంస్కరణలు (భారత ప్రజలు నిరాకరించిన మాంటేగ్-చెమ్స్‌ఫర్డ్ సంస్కరణలు) జయప్రదం కావడానికి నా శాయశక్తులా పనిచేస్తాను"!** అంతేగాదు, 1942లో కూడా భారత స్వాతంత్ర్య సమర లక్ష్యాలకు విరుద్ధంగా "హిందూ మహాసభ" వాదులు "ప్రభుత్వ సర్వీసుల్లో ఉన్న ఉద్యోగులెవరూ రాజీనామా చేయొద్ద"నీ, పదవులకే అంటిపెట్టుకుని ఉండమనీ "మహాసభ" సలహా ఇచ్చింది! అలాగే "ఇండియాలో ఆర్.ఎస్.ఎస్ వల్ల శాంతిభద్రతలకు ప్రమాదం లేద"ని బ్రిటిష్ హోంశాఖ 1943లో ప్రకటించడానికి కారణం ఏమిటో వెంకయ్యకు తెలుసా?! 'కమ్యూనిస్టుల్ని అణచడంలో మీకు సహకరిస్తామని' ఆర్.ఎస్.ఎస్ నాయకత్వం బ్రిటిష్ ప్రభుత్వానికి ఇచ్చిన హామీకి ముదరాగానే సామ్రాజ్యవాదులు ఈ రాయితీ ప్రకటించారని మరవరాదు! మరో

మాటలో చెప్పాలంటే, మహ్మదాలీ జిన్నా కన్నా (1940లో) దేశ విభజన సూత్రాన్ని పదిహేనేళ్ళు ముందుకు నెట్టినవాడు సావర్కర్ (1925 నాటికే)! ఈ గాథ సావర్కర్ 'హిందూత్వ' పుస్తకంలో వెంకయ్యకు దొరుకుతుంది! బి.జె.పి, విశ్వహిందూ పరిషత్, బజ్‌రంగ్ దళ్- ఈ మూడింటికీ "గురు" స్థానం ఆర్.ఎస్.ఎస్‌ది. 1984 ఏప్రిల్‌లో విహెచ్‌పి చేసిన తీర్మానానికీ, 1984 మే-జూన్‌లో "బజ్‌రంగ్ దళ్" అవతరణకూ సంబంధం ఉంది అయోధ్యలోని బాబ్రీ మసీద్ ఉన్న స్థలాన్ని "విముక్తి" చేయడం (అంటే కూలగొట్టడం) లక్ష్యంగా విశ్వహిందూ పరిషత్ తీర్మానం చేసింది! అక్కడి నుంచీ "పరివార్" మురాను పట్టుకున్నది దేశ రాజకీయాలూ కాదు, దేశ ప్రయోజనాలూ కావు, కేవలం 'దేవాలయ' రాజకీయాలు, దేవాలయ మత రాజకీయాలూ. కనుకనే అద్వానీ, వాజ్‌పేయి, మురళీ మనోహర్‌జోషీల ఆధ్వర్యంలో బి.జె.పి ఒకవైపు నుంచీ, అశోక్ సింఘాల్ నాయకత్వంలో వి.హెచ్.పి మరొకవైపు నుంచీ, వినయ్ కతియార్ ఇంకొకవైపు నుంచీ- భారత రాజకీయ వ్యవస్థనూ, సమాజాన్నీ భ్రష్టుపట్టిస్తూ వచ్చారని గుర్తించాలి. నేడు గుజరాత్‌లో మైనారిటీలపై తలపెట్టిన మారణ హోమానికి కారకులైన పరివార్ నాయకులను అంతర్జాతీయ క్రిమినల్ చట్టం కింద నేరస్తులుగా పరిగణించవలసి వచ్చేసరికి ఆ అవమానం నుంచి తప్పించుకోడానికి బి.జె.పి పరివార్‌కు నేడు డాక్టర్ కలామ్ పేరు ముసుగుగా అవసరమయిందని లోకులు గ్రహించేశారని వెంకయ్య తెలియనట్టు నటించితే ఎలా?!

## 2

**అ**జాద్ హింద్‌ఫౌజ్, భారత జాతీయ సైన్యం (ఇండియన్ నేషనల్ ఆర్మీ) వ్యవస్థాపకుడయిన నేతాజీ సుభాష్ చంద్రబోస్ విషయంలో భారత కమ్యూనిస్టుల లేదా 'వామపక్షాల వైఖరి గురించి కేంద్రమంత్రి వెంకయ్యనాయుడు చేసిన ఆరోపణలు కూడా అవకాశవాద రాజకీయాలలో అంతర్భాగమే. భారత స్వాతంత్ర్యోదమ్య కాలంలో పాల్గొన్న విభిన్న రాజకీయ పక్షాలలో ఉద్యమం నడుస్తున్న తీరుపట్ల, నడవాల్సిన తీరుపట్ల వ్యూహాలలోనూ, ఎత్తుగడలలోనూ భిన్న దృక్పథాలు నాడు వ్యక్తమయ్యాయి. నాడు సుభాష్ చంద్రబోస్‌ను కమ్యూనిస్టులు "విద్రోహి" అన్నారనీ, అటువంటి బోస్‌కు చెందిన జాతీయ సైన్యంలోని యోధురాలు కెప్టెన్ లక్ష్మి ఎలా రాష్ట్రపతి అభ్యర్థిగా పనికొచ్చిందని వెంకయ్య లాంటి చరిత్ర తెలియని అమయాకులు కొందరు ప్రశ్నిస్తున్నారు. కాని ప్రాథమిక సమాచారంలోనే వెంకయ్య పప్పులో కాలు వేశారు. ఎందుకంటే - కెప్టెన్ లక్ష్మి జాతీయ సైన్యం నుండి వేలువిడిచి ఫార్వర్డ్‌బ్లాక్‌తో కొన్నాళ్ళుండి, ఆ తరువాత కమ్యూనిస్టు ఉద్యమంలో చేరడం, ఆమె యిప్పుడు మార్క్సిస్టుపార్టీలో ఉండడమూ, అందరికీ తెలిసిన చాలా పాత పరిణామమని వెంకయ్యకు

తెలియదు! అంతేగాదు, నాడు భారతదేశానికి స్వాతంత్ర్యం సంపాదించాలని తీవరించిన దేశాభిమానం. ఆనాడు కాంగ్రెస్ నాయకత్వంలోని ఒక వర్గం "శత్రువుకు శత్రువు మన మిత్రుడ"న్న నీతిలో భాగంగా బ్రిటన్‌కు వ్యతిరేక కూటమిగా రెండో ప్రపంచ యుద్ధ సమయంలో అవతరించిన హిట్లర్ జర్మనీ, ముసోలినీ ఇటలీ, టోజో జపాన్ ఫాసిస్టు కూటమితో సంబంధాలు పెట్టుకోవాలని ఆశించింది. అందుకు ప్రయత్నాలు చేసింది. ఈ వర్గానికి నాయకుడు బోస్ కాంగ్రెస్ మితవాద రాజకీయాలతో తలమొత్తిన బోస్ దేశ స్వాతంత్ర్యసాధన కోసం జర్మనీ, ఇటలీ, జపాన్ ఫాసిస్టు, నాయకత్వాలతో చేతులు కలపడం ద్వారా ఇండియాకు స్వాతంత్ర్య ప్రదానం దగ్గరవుతుందని ఆశించాడు కాని భారతదేశంలోని కాంగ్రెస్ నాయకత్వానికీ, కమ్యూనిస్టు నాయకత్వానికీ ఈ వైఖరి మింగుడుపడలేదు. గాంధీ, నెహ్రూలకు, జాతీయవాదులకు కూడా ఒక వైపున బోస్ దేశభక్తిపట్ల అనుమానం లేకపోయినా, బోస్ నిర్ణయం వింతగాతోచింది. బోస్ వైఖరి చూచి తమను తామే నమ్మలేకపోయారు. ఎందుకంటే, కాంగ్రెస్ అధ్యక్ష స్థానానికి జరిగిన పోటీలో బోస్‌ను కాంగ్రెస్‌లోని అతివాదులు, కమ్యూనిస్టులూ బలపర్చినవారే. అప్పటికి ప్రపంచమంతా ఫాసిస్టు "అక్షరాజ్యాల" (యూక్సిస్ పవర్స్) కు వ్యతిరేకంగా ప్రపంచ వ్యాపితంగా ఫాసిస్టు వ్యతిరేక ఐక్యసంఘటన (అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్‌తో సహా ) ఏర్పడి పనిచేస్తోంది ఈ పరిస్థితుల్లో బోస్ ఫాసిస్టులతో "చేతులు కలపడా"న్ని వామపక్ష శక్తులు సహా జాతీయ వాదులెవరూ జీర్ణించుకోలేకపోయారు. అందాకా ఎందుకు? బోస్ "జాతీయ సైన్యం" ఇండియన్ నేషనల్ ఆర్మీ వ్యవస్థను శంకించిన పండిట్ నెహ్రూ సహితం ఇండియన్ నేషనల్ ఆర్మీకి చెందిన కెప్టెన్ లక్ష్మి సెహగల్‌పైన, ఆమె సహచరులపైన బ్రిటీష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం బనాయించిన "దేశద్రోహ" అభియోగాన్ని (1946లో) విచారణ సందర్భంగా వ్యతిరేకించిన వాస్తవం వెంకయ్యకు తెలుసా? జవహర్‌లాల్ నెహ్రూ, భులాబాయ్ దేశాయ్‌లు, అలాగే సుభాష్ చంద్రబోస్, కమ్యూనిస్టులూ సైద్ధాంతికంగా వాదులాడుకొన్న రోజులున్నాయి. పైగా, సుభాష్‌బోస్ ఇండియానుంచి అఫ్ఘనిస్తాన్‌కు తప్పించుకుపోవాలని నిర్ణయించుకున్నప్పుడు, ఆపైన అఫ్ఘనిస్తాన్ నుంచి సోవియెట్ వెళ్లడానికి రహస్యంగా ఏర్పాట్లుచేసి ఆముదార్యానదిని దాటించడంలో బోస్‌కు తోడ్పడినవారు పంజాబ్ కమ్యూనిస్టు విప్లవకారులైన రామ్‌కిషన్, భగత్‌రామ్ తల్వార్ అని మరవరాదు. తర్వాత తల్వార్ సోదరులను తెల్లవాళ్లు ఉరితీశారు! కాని, బోస్ ఫాసిస్టు కూటమితో చేతులు కలిపినందుకే కమ్యూనిస్టులు నిశితవిమర్శ చేశారేకాని, ఆయన జాతీయవాది కాదనీ, వామపక్ష జాతీయవాదికాదనీ ఎన్నడూ అనలేదు. దేశానికి స్వాతంత్ర్యం సంపాదించడానికి భిన్న మార్గాలు అనుసరించిన జాతీయవాదులూ, విప్లవకారులూ,

ఉద్యమకారులూ వున్నారు గాంధీ అహింసామార్గం ద్వారా, భగత్‌సింగ్ హిందూస్తాన్ రివల్యూషనరీ పార్టీ తిరుగుబాటు ద్వారా, కమ్యూనిస్టు పార్టీలు విప్లవోద్యమ నిర్మాణం ద్వారా, గదర్ వీరులు విదేశాలలోని విప్లవకారుల సహకారం ద్వారా స్వాతంత్ర్య సాధన కోసం కృషిచేయగా, బోసు నాజీ జర్మనీ, ఇటలీ, జపాన్‌ల సహాయంతో భారత దేశానికి స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలు సిద్ధిస్తాయని నమ్మినవారు లక్ష్యసాధనలో వ్యూహాలు, ఎత్తుగడలూ విభిన్న మార్గాలు పట్టినా - 1945-1946 కాలంలో బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టులూ, సుభాష్ చంద్రబోసు అనుచరులూ భుజం భుజం కలిపి పోరాడారని సుభాష్‌బోసు కుటుంబానికి అత్యంత సన్నిహితులైన గౌతమ్ ఛటోపాధ్యాయ రాశాడు ("Subhas Chandra Bose, The Indian leftists and Communists"గ్రంథం). కడచిన మూడు దశాబ్దాలుగా, అనేక సమస్యలపై ఏకవాక్యతతో కమ్యూనిస్టులూ, ఫార్వర్డ్‌బ్లాక్ లెఫ్ట్‌ఫ్రంట్‌గా సమిష్టిగా వ్యవహరిస్తున్నాయనీ, యుద్ధ కాలంనాటి అతివాద, మితవాద ధోరణుల మధ్య సమన్వయశక్తిగానే ఈ సమైక్యతను చూడాలనీ ఆయన రాశాడు అటు కాంగ్రెస్‌లోగానీ, ఇటు కమ్యూనిస్టులలోగానీ బోస్ పట్ల సరైన అవగాహన ఏర్పరచుకోడానికి తగిన వాతావరణం కూడా ఆనాటి యుద్ధ కాలంలో లేకపోయింది ఇందుకు కారణాలను పేర్కొంటూ బోస్‌ను గురించి యుద్ధానంతర కాలంలో అందిన సరైన సమాచారాన్ని గౌతమ్ ఛటోపాధ్యాయ అందించారు గౌతమ్ పరిశోధన ప్రకారం, జర్మనీ, జపాన్‌లు తనను మోసగించాయని బోసు కొన్నాళ్ళ తర్వాత గ్రహించాడు అ తర్వాత కొన్నాళ్లు సోవియెట్ నాయకులతో సంబంధాలు పెంచుకోడానికి ప్రయత్నించాడు బోస్. కాంగ్రెస్ వాదుల్లో, కమ్యూనిస్టులలో, ఇతర జాతీయవాదులలో బోస్ వైఖరిపట్ల ఏర్పడిన అనుమానాలు 1945-46 మధ్యకాలంలోనే నివృత్తికావడానికి ఏ పరిణామాలు తోడ్పడ్డాయో గౌతమ్ ఛటోపాధ్యాయ తన గ్రంథంలో యిలా పేర్కొన్నారు. 1 ఆగ్నేయాసియాలో హిట్లర్ విధానాలను బోస్ జర్మనీలో ఉండగానే ఖండించడంతో హిట్లర్‌కు బోస్ పట్ల ప్రాతికూల్యం వ్యక్తమయింది. ఆగ్నేయాసియాపట్ల జర్మనీ ధోరణకి భారతీయుల నిరసనను బోస్ వ్యక్తం చేశాడు. బోస్‌ను కలుసుకోవడానిక్కూడా హిట్లర్ నిరాకరించాడు. ఒకవేళ హిట్లర్ ఇండియన్ నేషనల్ ఆర్మీ (INA) వాలంటీర్ దళాల్ని ఇబ్బందుల పాల్జేసే పక్షంలో వాలంటీర్లు అవమానాలు భరించేకన్నా నాజీ తుపాకిగుళ్లకు బలికావడానికైనా సిద్ధంకావాలని బోస్ ఉద్బోధించాడు, 2. జర్మనీలోని "భారత జాతీయ సైనిక దళాన్ని సోవియెట్‌పై దాడులకు హిట్లర్ వినియోగించడానికి బోసు అంగీకరించ లేదు 3. అలాగే "ఇండియన్ నేషనల్ ఆర్మీ" దళాల్ని అంగ్‌సాన్ నాయకత్వంలో వున్న " బర్మా ప్రతిఘటనోద్యమా"నికి వ్యతిరేకంగా జాపనీస్ సామ్రాజ్యవాద ప్రభుత్వం ఉపయోగించుకోడానికి బోసు (1945 మార్చి) నిరాకరించాడు. ఇంకా స్పష్టంగా

చెప్పాలంటే బోసు 1945 మే 25వ తేదీన బాంకాక్ రేడియో కేంద్రం నుంచి యిచ్చిన ఉపన్యాసం క్రమంగా ఆయనలో జర్మనీ, జపాన్ ఫాసిస్టుల అసలు నైజంపట్ల అంతకు ముందున్న భ్రమలు కాస్తా తొలగనారంభించాయి.

అంటే, గౌతమ్ అంచనా ప్రకారం, తొలినాళ్లలో బోస్ జపాన్, జర్మన్ ఫాసిస్టుల పట్ల భ్రమలు పెంచుకుని, వాళ్ల సహాయంద్వారానే భారత స్వాతంత్ర్య సిద్ధి సాధ్యమని నమ్మిన దశలో ఈ వైఖరి తప్పుఅనీ, ప్రమాదకరమనీ కాంగ్రెస్ వాదులలో పెక్కుమంది, కమ్యూనిస్టులూ, ఇతర జాతీయవాదులూ భావించడం ఎంతమాత్రం ఆశ్చర్యం కలిగించదు. సరిగ్గా ఈ సమయంలోనే నాజీ (హిట్లర్) జర్మనీ విధానాలను, కమ్యూనిజాన్నీ, కమ్యూనిస్టులనూ, మట్టుపెట్టి ప్రపంచాధిపత్యం కోసం వ్యూహం పన్నుతున్న హిట్లర్ పన్నాగాలకు యూరప్‌లోని కొన్ని దేశాలలో వత్తాసు పలికిన వారిని "పంచమాంగ దళాలు"గా "విద్రోహులు"గా (క్విజ్లింగ్స్) ఆయా దేశాల స్థానిక జాతీయ నాయకత్వాలు శరించడం లోకానికి తెలిసినదే. ఆ మాటకొస్తే ఫ్రాన్స్‌లోని "పాపులర్ ఫ్రంట్" నాయకత్వాన దేశంలోని హిట్లర్‌కు అనుకూలంగా ప్రబలుతున్న "ఫాసిస్టులీగ్స్" లో ఒక టైన "క్రోయిదఫూ"(CROIX DEFEU) ఫాసిస్టు ధోరణులను ఖండిస్తూ దేశ వ్యాపిత ఉద్యమం చేపట్టింది. ఫ్రాన్స్‌లో హిట్లర్ అనుకూల "విచీ" ప్రభుత్వానికి (నాటి ఫ్రాన్స్‌రాజధాని 'విచీ') మార్షల్ పేటన్ ప్రధాని అయ్యాడు. అప్పటిదాకా ప్రధానిగావున్న పాల్ రేనాడ్‌ను కూలదోసి పేటన్ ప్రధానిగా అవతరించాడు. మరోవైపున జర్మనీతో "శాంతి" సంధిపేరిట ఇంగ్లాండ్‌లో ప్రధాని చాంబర్లేన్ మ్యూనిక్ ఒప్పందం ద్వారా తమదికాని చెకోస్లొవేకియాను హిట్లర్‌కు ధారాదత్తం చేశాడు చాంబర్లేన్ చర్యలను హిట్లర్‌కు దాసోహంగా ఇంగ్లాండ్‌లోని పెక్కుమంది నిరసించవలసివచ్చింది. కనుకనే పేటన్, చాంబర్లేన్‌లు, చరిత్రహీనులై కాలగర్భంలో కలసిపోయారు. బహుశా ఈ పరిణామాల పూర్వరంగాన్ని దృష్టిలో పెట్టుకునే గౌతమ్ ఛటోపాధ్యాయ బోసును గురించిన తన తలపోతల్లో యిలా పేర్కొని ఉంటాడు : "సుభాష్ బోస్‌కు ఉన్నతమైన, అత్యంత విలువైన దేశభక్తి భావాలున్నప్పటికీ చరిత్ర గురించిన ఆయన అవగాహన రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో మౌలికంగానే తప్పు అనీ, ఫాసిస్టు అక్షరాజ్యాలైన జర్మనీ, జపాన్‌లు ప్రపంచాధిపత్యంకోసం అర్రులు చాచికూర్చున్న బలమైన రాజ్యాలనీ, నేతాజీని అభిమానించే చరిత్రకారులు, సమరశీల కార్యకర్తలూ నిర్మొహమాటంగా అంగీకరించారు". అయితే ఇక్కడ గమనించవలసిన అంశం 1945-మే 25న బోస్ బాంకాక్ నుంచి చేసిన రేడియో ప్రసంగం ఆయనలో వస్తున్న భావ పరివర్తనకు ప్రబల నిదర్శనం. ప్రపంచమానవాళికి మార్గ నిర్దేశం చేయడానికి బోస్ సోవియెట్ యూనియన్ వైపు ఎంతో ఆశతో చూశాడు. ఈ వాస్తవాలవైపు ఏనాడైనా ఒక పట్టభద్రునిగానైనా మన వెంకయ్య నాయుడు శ్రద్ధ కనబరిచారా?

ఎంతసేపూ, జాతీయోద్యమంతో బొత్తిగా సంబంధంలేని, అంటూ సొంటూలేని వేరుపురుగులుగా, అవకాశం దొరికితే బ్రిటిష్ వాళ్లకు వందిమాగధులుగా, వార్ కాంట్రాక్టు కూలీలుగా పనిచేయడానికి జంకని సంఘ్‌పరివార్ వర్గాన్ని భుజాన వేసుకొస్తే సరిపోతుందా? పరివార్ "దేశభక్తి"కి ఒక్కటంటే ఒక్క నిదర్శనాన్ని ('అయోధ్యలో జరిపిన కిష్కింధకాండ, తప్ప) వెంకయ్య ఇవ్వగలరా? ఏ కెప్టెన్ లక్ష్మీ సెహగల్ అభ్యర్థిత్వాన్ని వామపక్షాలపై నిర్హేతుకమైన ఆరోపణలతో కించపరచడానికి వెంకయ్య ప్రభృతులు కాల్దువ్వుతున్నారో ఆ వామపక్ష శక్తులే , ఆనాటి విద్యార్థి యువజన బృందాలే 1945 నవంబర్ 22న బోస్ నేషనల్ ఆర్మీ నాయకులైన మేజర్ జనరల్ షానవాజ్, కర్నల్ ధిల్లాన్, కెప్టెన్ పి.సెహగల్ (కెప్టెన్‌లక్ష్మి భర్త)లపై "దేశద్రోహ" నేరవిచారణకు నిరసనగా గీతా ముఖర్జీ ప్రభృతుల (కమ్యూనిస్టుల) ఆధ్వర్యంలో బ్రహ్మాండమైన ప్రదర్శన జరిపారని వెంకయ్యకు తెలియదు. గీతాముఖర్జీ, బద్మల్ హైదర్‌ల నాయకత్వంలో కాంగ్రెస్, ముస్లింలీగ్, కమ్యూనిస్టు పక్షాలతో కలసిన మూడు జెండాల సమైక్యతా దృశ్యాన్ని సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తు లన్నింటి ఐక్యతా చిహ్నంగా ప్రదర్శించిన చారిత్రక సన్నివేశం వెంకయ్య ఎలామరచిపోయారు? అంతేగాదు, ప్రపంచ ప్రసిద్ధ మేధావులలో ఒకరు, వివేకానంద చరిత్ర గ్రంధకర్త, నోబెల్ బహుమాన గ్రహీత రోమరోలా ఫాసిస్టు అక్ష్యరాజ్యాలతో బోసు చేతులు కలపడాన్ని నిరసిస్తూ తన "డైరీ"లో రాసుకున్నాడు. "బెర్లిన్‌కు బోస్‌రాక, జర్మనీ స్వాగతం, మరోసారి బోస్ సాహసించాడు. ఆయన ఒకసారి మితవాదంవైపు, మరోసారి అతివాదం వైపు మొగ్గుతుంటాడు- బెర్లిన్ , టోక్యో, మాస్కో".. (ఎల్.ఎ.గోర్డన్ రాసిన "బ్రదర్స్ ఎగైనెస్ట్ దిరాజ్ " పుస్తకం)"

ఏది ఏమైనప్పటికీ, సిద్ధాంత విభేదాలు ఎన్నివున్నా కాంగ్రెస్‌నుంచి విడిపోయిన తర్వాత, విడిపోక ముందూ సుభాష్ చంద్రబోసు, కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమంలో అనేకసార్లు కలసి పనిచేశారనీ, సైమన్ కమిషన్ రాకను నిరసిస్తూ బోసు అనుయాయులు, కార్యకర్తలు, కమ్యూనిస్టు కార్యకర్తలూ సంయుక్తంగా ప్రదర్శనలు నిర్వహించారని గౌతమ్ తెలిపారు. "పెషావర్ - బోల్షివిక్ కుట్ర" కేసులో మియాన్ అక్బర్‌షా ఫార్వర్డ్ బ్లాక్ వర్కింగ్ కమిటీ సభ్యుడుకాగా, మీరట్, లాహోర్, కాకోరి కుట్రకేసుల ద్వారా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న సమరశీల శక్తుల్నీ, విప్లవకారుల్ని బ్రిటిష్ సామ్రాజ్యవాదులు నానా యిబ్బందుల పాలుచేశారు. ఎందుకని? గౌతమ్ ఇలా వివరించాడు: "ఇండియాలో బ్రిటిష్ పరిపాలనా పునాదులనే పెకిలించివేయగల అత్యంత ప్రమాదకర శక్తులుగా వామపక్ష జాతీయవాదులు, సుభాష్‌చంద్రబోస్, కమ్యూనిస్టులూ అవతరించారని బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం భావించింది.

ఫలితంగా ప్రభుత్వం కార్మికవర్గ ట్రేడ్‌యూనియన్ నాయకులపైన పెద్దయెత్తున ఆకస్మిక దాడులు సాగించి, మీరట్, లాహోర్ కుట్ర కేసులు బనాయించింది ఈ విధంగా కమ్యూనిస్టులూ, బోసు నాయకత్వంలో వున్న వామపక్ష భావాలు గల జాతీయవాదులూ పరస్పరం దగ్గర కావడానికి సామ్రాజ్యవాదుల నిర్బంధ విధానం తోడ్పడింది". అంతేగాదు, భారత జాతీయ కాంగ్రెస్ లాహోర్ మహాసభలో "సంపూర్ణ స్వరాజ్యమే" భారత జాతీయోద్యమం లక్ష్యంగా ఉండాలని చేసిన తీర్మానాన్ని కమ్యూనిస్టులూ, బోసూ ఇతర కాంగ్రెస్ వాదులతో కలిసే ఏకగ్రీవంగా ఆమోదించారని వెంకయ్యకు తెలియదు! తెలిసే అవకాశంగానీ, తెలుసుకునే జ్ఞానంగానీ జాతీయోద్యమంతో సంబంధంలేని పరివార్ మతఛాందసవాదులకు లేనందున, వెంకయ్యకూ అబ్బి వుండదు! సుభాష్‌చంద్రబోస్ తన విశిష్ట రచనలైన "ఇండియన్ స్ట్రగుల్", "క్రాస్‌రోడ్స్" వ్యాస పరంపరలో ఒక సందర్భంగా గాంధీవాదంపై భారతదేశంలో మేధావివర్గం తిరుగుబాటు ఏ దిశాగతిలో సాగవచ్చునో యిలా పేర్కొన్నారు: "గాంధీయిజంపై దేశంలో మేధావుల తిరుగుబాటు సోషలిస్టు లేదా కమ్యూనిస్టు పంథా తొక్కవచ్చు" అన్నారు అలాగే 1940లో ఢిల్లీలో జరిగిన అఖిలభారత స్టూడెంట్స్ ఫెడరేషన్ మహాసభకు బోసు హాజరైనప్పుడు బ్రిటిష్ ప్రభుత్వం భారత రక్షణ చట్టం కింద ఆయనను అరెస్టు చేసింది. ఇందుకు నిరసనగా కమ్యూనిస్టులు, స్టూడెంట్స్ ఫెడరేషన్ కార్యకర్తలూ పెద్దపెట్టున నిరసనగా ప్రదర్శనలు జరిపారు. ఈ నిరసనోద్యమం హిందూ-ముస్లిం ఐక్యతకు మరింత బలం చేకూర్చిందని వెంకయ్యకు తెలియదు! వ్యూహాత్మక ఎత్తు గడలపైన కమ్యూనిస్టులతో బోస్ విభేదించినా గౌతమ్ చెప్పినట్టు "కమ్యూనిస్టులతో అనేక సమస్యలపై విభేదాలున్నా బోస్ సమరశీల జాతీయవాదులను విశ్వసనీయమైన మంచి మిత్రులుగానే భావించారు". అవనీష్ ముఖర్జీలాంటి విప్లవకారులకూ, ఇతర బెంగాలీ విప్లవకారుల సాయంతో తలదాచుకోడానికి రక్షణ కల్పించినవాడు బోస్. సమరశీల కార్యకర్తల పట్ల బోస్‌కు ఉన్న ఈ విశాల దృక్పథంవల్లనే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఉద్యమ నాయకులు మాస్కోలో జరిగిన (1922) ఇంటర్నేషనల్ నాల్గవ మహాసభకు చిత్తరంజన్‌దాస్, ఎస్ ఎ డాంగేలతోపాటు బోస్‌నూ ఆహ్వానించారని కూడా వెంకయ్యకు తెలిసే అవకాశం లేదు!

"పరివార్" వర్గానికి దాపురించిన ఈ చారిత్రక అజ్ఞానానికి ప్రధాన కారణం- జాతీయోద్యమంతో సంబంధాలు లేకపోవడం, ఫలితంగా స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న అనుభవం పూజ్యం కావడం, ఫలితంగా మతఛాందసవాదం ద్వారా దేశంలో తమ ఉనికిని కాపాడుకోడానికి ఎలాంటి తప్పుడు పనులకైనా

దిగజారడమూ. ఇందుకు భారత స్వాతంత్ర్యానంతర చరిత్రలో కొట్టవచ్చినట్లు కన్పించే విస్మరించరాని మూడు ఘట్టాలు :

(1) ముస్లిం మైనారిటీలపైన ద్వేషంతో హిందూ-ముస్లిం ఐక్యతను వాంఛించి అందుకు తనకు తోచిన రీతిలో దోహదపడుతున్న గాంధీజిని ఆర్.ఎస్.ఎస్. యాక్టివ్ కార్యకర్త నాధూరామ్ గాడ్సే ప్రభృతులు హత్య చేయడం, (2) అద్వానీ "సోమనాథ్ నుంచి అయోధ్య"కు తలపెట్టిన మత రథయాత్ర ద్వారా ఓ కల్పిత గాథ ఆధారంగా అయోధ్యలో రామ మందిర నిర్మాణం పేరిట బాబ్రీ మసీదును కూలదోసి కిష్కింధకాండ సృష్టించి మతోద్రేకాలను తారాస్థాయికి చేర్చి, అనేకమంది ప్రాణాలు తోడడం, (3) బి.జె.పి. పరివార్ ఛాందస ధోరణులకు పరాకాష్టగా ఇటీవల గుజరాత్‌లో పరివార్ ప్రత్యక్ష నాయకత్వంలో ముస్లిం మైనారిటీలపై మూకుమ్మడిగా సాగించిన ఊచకోతలు, ఫలితంగా సుమారు 2000 మంది ప్రాణాలు కోల్పోవడమూ, గల్లంతు కావడమూ, వేలాది ఇళ్ళు, వంద లాది షాపులూ, మసీదులు, దర్గాలూ ధ్వంసం కావడం, గుజరాత్ ఆర్థిక వ్యవస్థకు వేలకోట్ల రూపాయలలో నష్టం కల్గించడమూ, దఫదఫాలుగా చర్చీలపైన, క్రిస్టియన్ మైనారిటీలపైనా దాడులు కొనసాగించడమూ.

## వేదాలు వల్లిస్తున్న దెయ్యాలు!

అన్నింటికన్నా మరో పెద్ద జోక్- గాంధీని చంపిన పరివార్‌కు చెందిన అద్వానీ 1980 డిసెంబర్‌లో జరిగిన బి.జె.పి బొంబాయి సమావేశంలో "గాంధీయన్ సోషలిజం" తమ ధ్యేయమని ప్రకటించడం! చివరికి వాళ్ళు ఎంతటి అబద్ధాలకైనా వెనుదీయరనడానికి నిదర్శనం- రామజన్మభూమి అయోధ్యేననీ, ఆ విషయమై గాంధీజీ 1937లోనే "నవజీవన్" "హరిజన్ సేవక్" పత్రికలలో రాశారని విశ్వహిందూ పరిషత్ అధ్యక్షుడుగా పనిచేసిన ఎల్.సి. పౌలజ్ కోతకోశాడు. ఈ విషయాన్ని తెలుపుతూ 1990లో ప్రధానిగా వున్న చంద్రశేఖర్‌కు బి.జె.పి. ప్రధాన కార్యదర్శిగా పనిచేసిన కృష్ణలాల్ శర్మ రాసిన లేఖాంశాలూ పచ్చి అబద్ధాలని "టైమ్స్ ఆఫ్ ఇండియా" పత్రిక 1990 డిసెంబర్ 4 సంచికలో పూర్తి రీసెర్చి అనంతరం వెల్లడించింది. దాంతో పరివార్ బదనామయిపోయిన సంగతి వెంకయ్య మరచిపోతే ఎలా? "టైమ్స్ ఆఫ్ ఇండియా" పత్రిక రుజువుల కోసం విసిరిన సవాళ్లను స్వీకరించలేక బి.జె.పి. పరివార్ తోకముడవవలసి వచ్చింది. "నవజీవన్", "హరిజన్ సేవక్" పత్రికల కాపీలు కావాలని పదేపదే "టైమ్స్" కోరినా ఆ రోజుకీ, ఈ రోజుకీ అందించగల ధైర్యం వారికి లేకపోయింది. ఇన్ని మాటలెందుకు? 1982లో కన్యాకుమారిలో చెలరేగిన మతకలహాలకు బాధ్యులెవరని

విచారించడానికి నియమించిన జస్టిస్ పి.వేణుగోపాల్ కమిషన్ తన తీర్పులో ఏం చెప్పిందో చూద్దాం :

'మత కలహాల్ని రెచ్చగొట్టడానికి ఆర్.ఎస్.ఎస్ అనుసరించే పద్ధతులు- (అ) క్రిస్టియన్లు భారతదేశ పౌరులు కారని ప్రచారం చేయడం ద్వారా మత భావాలను రెచ్చగొట్టడం, (ఆ) మైనారిటీల జనాభా పెరుగుతోందని ప్రచారం చేయడం, (ఇ) పరిపాలనా శాఖలలోకి ఆర్.ఎస్.ఎస్. చొచ్చుకుపోవడం ద్వారా, మతపరమైన ధోరణులను వ్యాప్తిచేసి, పెంచడం ద్వారా క్రమంగా సివిల్, పోలీస్ సర్వీసులలోకి ఆర్.ఎస్.ఎస్. సభ్యుల్ని చొప్పించడం, (ఈ) కత్తులు, కరార్లు, ఈటెలు లాంటి మారణాయుధాలను ప్రయోగించడంలో యువకులకు శిక్షణ యివ్వడం, (ఉ) ఏ చిన్నపాటి ఘటన జరిగినా దాన్ని అవకాశం చేసుకుని ఆ ఘటనకు చిలవలు పలవలు అల్లడం ద్వారా మతాల మధ్య అంతరాన్ని పెంచి, మత భావాలను రెచ్చగొట్టడానికి వదంతులు వ్యాపింపజేయడం, సమాజంలో అంతర్యుద్ధ (సివిల్ స్ట్రయిఫ్) పరిస్థితులు కల్పించేందుకు శిక్షణ యివ్వడం, తరచుగా మైనారిటీలను బెదిరింపుల ద్వారా, భయభ్రాంతులు కల్పించి వారిలో భద్రతారాహిత్య భావాన్ని కల్పించడం. ఈ పద్ధతుల ద్వారా (మెథడాలజీ) ఆర్.ఎస్ ఎస్. ప్రజల శాంతిని మైనారిటీలపట్ల ద్వేషభావనతో దెబ్బతీసింది. ఇప్పుడు కన్యాకుమారిని మించి గుజరాత్ సరిహద్దులే గాక భారత సరిహద్దులు కూడా దాటి అంతర్జాతీయంగా దేశాన్ని దేశ ప్రజల గౌరవాన్నీ మంటగలిపాయి. గుజరాత్‌లో పరివార్ తలపెట్టిన నరమేధం గురించి జాతీయ మానవ హక్కుల సంఘం సిద్ధంచేసిన నివేదిక మొత్తం బి.జె.పి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఉనికినే ఊగించి శాసిస్తున్న విశిష్ట పత్రం. గుజరాత్ గాయం మైనారిటీ ప్రజలది కాగా, ముస్లిం మైనారిటీల వోట్ల కోసం శవజాగరణ మధ్యనే గుజరాత్‌లో "మోడీ ఫాసిజాన్ని" కొనసాగిస్తూనే తిరిగి దాన్నే ప్రతిష్ఠించడం కోసం ఎన్నికలను త్వరలో పూర్తిచేసుకునేందుకు, తద్వారా క్రమంగా పార్లమెంటు ఎన్నికలను కూడా పూర్తిచేసుకుని బయట పడేందుకే డాక్టర్ అబ్దుల్ కలామ్‌ను బి.జె.పి. తమ అభ్యర్థిగా రాష్ట్రపతి పదవికి ప్రకటించింది. ఈ 'కల' చెదిరిపోకుండా ఉండడం కోసమే కలామ్ అభ్యర్థిత్వానికి సమర్థనగా వామపక్షాలు నిలబెట్టిన స్వాతంత్ర్య సమరయోధురాలు, బోసు నేషనల్ ఆర్మీలో కెప్టెన్ అయిన లక్ష్మీ సెహగల్‌పైన, వామపక్షాలపైన వెంకయ్య ప్రభృతులు చారిత్రక వక్రీకరణలకు దిగడం! "అబద్ధాల అంకయ్యకు అరవైనాలుగు అసత్య ప్రమాణాల"న్న సామెత మన వెంకయ్యకు వర్తించకుండా ఉండుగాక!!